

# మాధవశతకము.







గ్రంథకర్త
జనగంటి పున్నయ్యాచారి
అప్పికట్ల.

ఓమ్

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః

# మాధవశతకము.

ఇది

శ్రీ సద్గురుసేవాధురీణుండును

అప్పికట్లపురీ నివాసుండును

కమ్మకులచంద్రుండును ఇనగంటి వర

సింహచౌదరి భావమాంబికాగర్భ సంజనితుం

డును ఆశుకవీంద్రుండును శతావధానియును.

విబుధజన విధేయుడైన

## పున్నయ్యచౌదరిచే

రచింపబడియె.

ప్రథమముద్రణము.

1000 ప్రతులు

విజయముద్రాక్షరశాల, బాపట్ల.

1924



దీనివెల రు. 0—4—0.



ఓం

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# మా ధ వ శ త క ము.



ఉ. శ్రీమదఖండమై విబుధ ♦ సేవ్యమునై మునిబృందవంద్యమై
శ్యామలవర్ణమై దనుజ ♦ సంహారణైక విశేషపూజ్యమై
కామవికారదూరమయి ♦ కాంచనవస్త్రము గల్గియున్న నీ
కోమలరూపమారయఁగఁ ♦ గోరికగల్గినదయ్య మాధవా. ౧

ఉ. శ్రీరమణీయమై వెలయు ♦ చిన్మయరూపుఁడవై ననిన్ను ముః
నారదపుండరీక సుర ♦ నాధుఁడు మున్నగు వారుచూడఁగా
నేరక ధ్యానయోగులయి ♦ నీపదసేవ యొనర్చియుండనే
నారయఁ బూనియుంట పరి ♦ హాసముగానగునే మొమాధవా. ౨

ఉ. ఏను సముద్రముల్ నదులు ♦ వృక్షములాకస మగ్ని వాయువుల్
మేడలు మిద్దెలద్దములు ♦ మేదిని తారలు పర్వతావళుల్
గోడలు ద్వారముల్ మొదలు ♦ లోకములన్నియు నీవెగాన నిః
జూడఁగలేనటన్నఁగదు ♦ వోద్యముగానగునే మొమాధవా. 3

ఉ. శౌరిముకుందకేశవ ని◆శాచరభంజన సారసాక్ష బృం
దారకపోషణాభుజగ◆తల్పజనార్దన మానిరక్షణా
సూరిజనావనాకు జన◆శోషణ శార్ఙ్గి సుపర్ణవాహనా
వారిజనాభ సూర్యకుల◆పావనగోత్రధరారమాధవా. ౪

ఉ. సోమకరాక్షసుండనెడు◆శూరుఁడు వేదము లబ్ధిముంపఁగా
దామరసోద్భవుండు పరి◆తాపముఁజెందుటఁజూచి చేపవై
సోమకుఁద్రుంచియానిగమ◆సూత్రములెల్లను దమ్మిచూలికిన్
బ్రేమనొసంగినాఁడవసి◆వింటినినీదు యశంబుమాధవా. ౫

ఉ. దేవతలున్నిశాచరులు◆ధీరధిసాగరమున్ మధింప నీ
వేవరకూర్మరూపివయి◆యీప్సితముల్ నెరవేర్పగా సుధన్
కీవిగదీసినారలట◆నిర్జరబృందము పూర్వదేవతల్
గావుననిన్ను నమ్మికొనఁ◆గష్టములెన్నఁడు లేవుమాధవా. ౬

ఉ. కక్షకులాలుద్రివిత్రిజ◆గంబులనాశనమొందఁజేయఁగా
దీక్షనుబూనియున్న రణ◆ధీరుఁడు క్రూరుఁడు పాపుఁడౌ హిర
ణ్యాక్షునిద్రుంచినాఁడవు మ◆హాద్భుతమైనవరాహరూపివై
సాక్షివిగావనన్నిటికి◆సాధ్యము సర్వము నీకుమాధవా. ౭

ఉ. శ్రీధరశ్రీధరాయనుచుఁ◆జిత్తములోస్మరియించుచున్న ప్ర
హ్లాదునిజేరి శ్రీధరుని◆నర్చనసేయఁగరాదటంచు సం
బోధనచే హిరణ్యకశి◆పుండు సుతున్ మరలింపలేక బల్
బాధలుబెట్టుతండ్రిని స◆భాస్థలిఁ గూల్చితివయ్యమాధవా. ౮

ఉ. వంచకుఁడై సురావళిని♦స్స్వర్గమునందు వసింపకుండ బా
ధించఁదలంచి గొప్పవ్రత మా♦దించి చరించి విరించికిన్ సదా
మించియసాధ్యుఁడై సకల♦మేదినిగెల్చి యజేయుఁడౌ బలిన్
వంచనఁజేసితొక్కితివి♦వామనరూపముదాల్చిమాధవా. ౯

ఉ. తజ్ఞులుమెచ్చుధర్మములఁ♦దప్పిచరించుచునిత్యమున్ బరా
వజ్ఞతసల్పుచున్ బుధుల♦బాధలబెట్టినయట్టి రాజులన్
ప్రాజ్ఞవిదూరులన్ బరశు♦రాముఁడవై దునుమాడినావు నీ
ప్రజ్ఞ బరీక్షఁజేయఁగఁ ద♦రంబెవిధాతృనకైనమాధవా. ౧౦

ఉ. తామరసోద్భవాది సుర♦తండములెల్ల దశాస్యుచేత బల్
బాములఁజెందితాళక వి♦పజ్జన బాంధవ కేశవా పరం
ధామముకుందనీకు శర♦ణంబనివేడఁగ రావణాసురున్
రాముఁడవై వధించితివి♦రాజ్యముతమ్మునకిచ్చిమాధవా. ౧౧

ఉ. ధారుణిసజ్జనుల్ ఖలుల♦దాడిసహింపఁగలేక దీనులై
దారిఁగనంగరాక మది♦తల్లడిలన్ బలరామమూర్తివై
గౌరవమొప్పవర్ధిలుచుఁ♦గౌరవపాండవ యాదవాదులన్
జేరిచిదుష్టులన్ దునిమి♦శిష్టులబ్రోచితివయ్యమాధవా. ౧౨

ఉ. అర్థవిహీనులన్ ధనికు♦లైన జనావళినిన్ ద్విజాళినిన్
పార్థివులన్ మనీషులను♦బామరులన్ బహునీచజన్ములన్
సార్థకులన్ సమస్తమును♦సాక్షివిగాఁ బరికించుచుండు భా
వార్థము బుద్ధరూపమని♦యార్యులుచెప్పిరి మున్నుమాధవా.

ఉ. గూఢముగాఁ జరించి బుధ◆కోటులఁ గూళలవేరుజేసి యా
మూఢమతప్రజాళినొక◆మూలకుఁజేర్చుటెగాక వారలన్
గాఢబలంబుఁజూపికడ◆కండలుపేర్వులుఁజీల్చిచంపనా
రూఢతనీవుశ్రీకలిక◆రూపముఁదాల్చెదవయ్యమాధవా. ౧౪

ఉ. దేహముశాశ్వతంబనిమ◆దిన్దలపోయుచు మూఢచిత్తుఁడై
మోహమునన్దగుల్కొని ము◆ముక్షువుగాక భవాగ్నిచేత వ్యా
మోహితుఁడైనవానికియ◆యుండుశ్రీమల్ గలిగించుగానసం
దేహములేకనా మనసు◆నీపయిఁజేర్చితినయ్యమాధవా. ౧౫

ఉ. వాసవసన్నుతాభువన◆వర్ధనభోగిశయాన సంతతా
భ్యాస వశంవదాసుజన◆పాలనపూతచరిత్ర శ్రీమనో
ల్లాసవిచిత్రమోహన వి◆లాస విశేషవికాస భూషణా
దాసహృదబ్జభృంగకుమ◆తవ్రతభంగశుభాంగమాధవా. ౧౬

ఉ. నాలుగువేదముల్ చదివి◆నన్ స్మృతులన్ బఠియించినేర్చినన్
లోలతనారుశాస్త్రముల◆లోఁగలసంగతులన్ గ్రహించినన్
గోలయెగాకయందుఁగల◆గోప్యమెఱింగిన నీవుదక్క నిం
కేలెఱువారలీజగతి◆కెవ్వరు లేరుగదయ్యమాధవా. ౧౭

ఉ. నీదయలేకయున్న ధర◆ణీస్థలిపాలనసేయు పార్థివుల్
బీదతనంబుఁ జెందుదురు◆పేదలునీదు కటాక్షమున్నచో
భూధవులై చెలంగుదుర◆మోఘయశః పరిపూర్ణమూర్తులై
నీదరిఁజేరినాఁడనను◆నీకరుణాంబుధిఁ దేర్చుమాధవా. ౧౮

ఉ. సారసపత్రనేత్ర మధుజైత్ర మహాబలఘోరదైత్య సం
హారకముఖ్యసూత్ర దురితావళి బంధలతాలవిత్ర బృం
దారకనాథమిత్ర మునిమండనవినిర్మల హృత్సరోజ సం
చారచరిత్ర గోత్రధర చారుపయోధరగాత్ర మాధవా. ౧౯

ఉ. కమ్మనితేనియల్ చిలుకు కైతను నీపయి గుమ్మరించనా
నెమ్మనమూనె నేనొక మనీషివరుండను గాను పంచకా
వ్యమ్ములు నేర్చియుండను బహ్వర్థవిచక్షణ జేయుశక్తి లే
శమ్మును లేదుగాన కొనసాగునొ సాగదొ శ్రీరమాధవా

ఉ. అన్నవగున్న మావిచిగురాకులు మెక్కుచు చొక్కకోయిలే
తెన్నన నేగదో మొలవతీవియలాకులకై యదేవిధిన్
గొన్ని చరిత్రలుండినను గోరదు నా మది నీచరిత్రమే
యన్నివిధంబులన్ దలచి హాయిని బొందుచునుండు మాధవా

ఉ. వన్నెలు చిన్నెలున్ గలుగు బంగరుపుట్టము బర్హిపింఛమున్
తిన్ననితమ్మికన్గవ సునీలపయోద నిభాంగసంపదన్
పున్నమవెన్నెలన్ మిగిలి ముద్దులుగుల్కెడి లేతనవ్వు నా
కన్నులపండువౌనటుల గాంచుదునో గనలేనొ మాధవా.

ఉ. గోపులగోపికామణులు గూరిమి మీరగ గాంచి రుక్మిణీ
దేవిని సత్యభామనొక తీరుగ నేలిన భాతిఁ దోఁపఁ బ్రి
జ్ఞావిభవంబు జూపుచు పసందగు సందెలజోఱుఘుంఝుణా
రావములీననాడెడు విరాజితరూపము జూపు మాధవా. ౨౩

ఉ. చిత్రముగా దెగర్చిత ని♦శాచరరాజ సమూహతంత్రమై
చిత్రవిఖండకాండమయి♦ జెన్నలరారెడు సీతగోపికా
పుత్రికలట్టె వచ్చితరి♦ ముద్దులు మెక్కెనటన్ యశోదయే
మాత్రమటంచు రోలొకటి- మాత్రమె నీవు నగట్టె మాధవా. ౨౪

ఉ. చల్లదనంపు చూపులు వ♦సంతులు గుల్కెడు నాట్యసంపదల్
తెల్లని లేత నవ్వొకడు♦ తియ్యపలోల్కెడి ముద్దుపల్కులున్
ఫుల్లసరోరుహాననము♦ మోహనశోభిత వేణుదండమున్
మెల్లగ పొంచిగాంచెద సు♦మీ కనునేర్పుతో శ్రీరమాధవా.

ఉ. పెందళుకీనఁ గాఁడులసి♦ పేరుల గుత్తులు గట్టియందమై
విందొనరించుచుండనొక♦ పిల్లనగ్రోవిని బట్టి నీటుగా
సిందురమద్దివచ్చుని ప♦సిండి మెరుంగు పటంబు దాల్చినా
ముందర నిల్వకున్న నెటు♦ మ్రొక్కఁగలాఁడనయా రమాధవా

ఉ. మామనుజంపినావు పలు♦మారులు గొల్లలపాలు దావి మా
రాములు జేసినావు నది♦ రాతిరి వెన్నల దోచినావు పెన్
బామును దొక్కినావు మరి♦ బావమఱందిని గొట్టినావు ని
న్నేమనవచ్చుఁ గొండవయి♦ కెత్తిన సామిన మామి మాధవా.

ఉ. ముమ్మొనవాలుఁ దాల్చు దొర♦ ముద్దుల చేడియ గంగ నీదు పా
దమ్మున నుద్భవించెనట♦ తమ్మియనన్ దనరారు పొక్కిలిన్
బమ్మ జనించియుండెనట♦ భారమొకింతయు లేక పద్మజాం
డమ్మును కుక్షి నుంచితట♦ నాకొక మారిటు జూపు మాధవా ౨౮

ఉ. బాలరసాలసాల నవ♦పల్లవకోమల కావ్యకన్యకన్
గూళలకీయనంచు సుకవి♦కోవిదవర్యుఁడు పోతరాజు పే
రోలగమందు జాటిన మ♦హోక్తి నవారిత భక్తితోడ నేఁ
దాలిచి మస్తకానఁ గయి♦తంబులు నీపయిఁ గూర్తు మాధవా. ౨౯

ఉ॥ చేతిని దాళమూని యొక ♦ చేతను దంబురఁ బట్టి భక్తితోఁ
బాతరలాడుచున్ గులుకు♦పాటలఁ బాడుచు సాకఁ జేయఁగా
నాతరమా యతీంద్రుఁడగు♦నారదమౌనికిఁ జెల్లు నేనయో
పాతకుఁడన్ విమూఢుఁడను♦పామరుఁడన్ గరుణించు మాధవా॥

ఉ॥ చుక్కలు చందమామ రవి♦శూలి పితామహుఁ డాకసంబు పెం
పెక్కఁ జలించు వాయువు మ♦హీస్థలి నీరము వీతిహోత్రుఁడున్
రక్కసిమూఁకలున్ విబుధ ♦ రాజినగంబులు లేనినాఁడు నీ
వొక్కఁడ వెట్టులుంటివో మ♦హోజ్జ్వలరూపుఁడవై రమాధవా॥

ఉ॥ ఓపురుషాగ్రణీ! విలసి ♦ తోరగరాజశయాన శౌరి స
ర్వాపదరాతి మౌనిహృద♦యాంబుజభృంగ శుభాంగ భక్తసం
తాపవినాశ దుర్మతవి♦దార కరీంద్రవిచార కాననో
ద్దీపిత వీతిహోత్ర నగ ♦ ధీరపవిత్రచరిత్ర మాధవా॥ ౩౨

ఉ॥ వారినివల్వలన్ విడచి ♦ వారిజనేత్రలు హేమసుందరా
కారిణు లందగత్తెలు వి♦కాసముఖుల్ గజగాములో యనన్
గేరెడి గొల్లజవ్వనలు ♦ క్రీడలుసల్పుచునుండఁ గట్టుపైఁ
జీరెలు దొంగలించిన వి♦శేషము దేమొ యెఱుంగ మాధవా॥

ఉ॥ పారవిహీనమైన భవ • సాగరమందు మునింగి తేలఁగా
నేరుపు లేక మానసము • నీరసమై కృశియించుచుండె వి
స్తారయశోవిలాస పరి • తాపము మాన్పెడి వాఁడవీవగా
కేరుగలారు నాకు తెర • వెయ్యది శీఘ్రమె ప్రోవుమాధవా ॥

ఉ॥ సమ్మతిలేనివారు పలు • శాస్త్రములన్ దిలకించి వానిసా
రమ్ముఁ గనంగలేక తమ • ప్రజ్ఞలె ముఖ్యముగాఁ గనెంచి భే
దమ్ములఁ బెంపుఁ జేసెడి మ • తమ్ముల చర్చలు సల్పి నీదుపా
దమ్ములఁ గొల్వనేర్చెడివి • ధమ్ము గ్రహించరు శ్రీరమాధవా ॥

ఉ॥ సౌరము వీరశైవమును • శైవము ద్వైతము సాంఖ్యభావముల్
భైరవ వల్లభాద్వయిత • వార్తిక తార్కిక బౌద్ధజైనముల్
సారము గ్రోలువారలకు • చాటుచునుందును నీదుపాదమం
దారమరందపానము వి • నాగతి లేదని శ్రీరమాధవా॥ ౩౬.

ఉ॥ లాలనుబోసి తల్లి కను • లన్ నును కాటుక దిద్ది ప్రేమతో
పాలనొసంగి జోలయని • పాటల బాడుచు చందనంబుతో
ఫాలము నలంకరించి యొక • పక్కనమర్చి పనందు మీర ను
య్యాలల నూపు బాల్యమున • టా నినుగొల్వను శ్రీరమాధవా॥

ఉ॥ కూరిమితోడ కుఱ్ఱలను • గూడి చరించుచుఁ జిల్లపేకలున్
బారులు బంతులీతలును • వామనగుంటలు గోలుగాయలున్
ధారుణి కూదుగుంటులును • దాగిలిమూతలనాడుచుండు కౌ
మారము నీదు ధ్యానమున • మాత్రము సేయదు శ్రీరమాధవా॥

ఉ॥ చందనగంధమున్ పునుఁగు • సన్నజాజులుమల్లెమొగ్గలున్
వందిరిమంచముల్ తళుకు • బంగరుసొమ్ములుపట్టుసేల్వలున్
సుందరమందగామినుల • చుట్టరికంబులుగోరిమోహమున్
జెందుదుయౌవనంబు నినుఁ • జేరగనీదుగదారమాధవా॥ ౩౯

ఉ॥ కోడలుగొట్టఁగూతురతి • కోపముఁజెందఁగుమారుఁడేవ పో
రాడగభార్యక్రూరపుకుక్ష • యున్ గృశియించుచునుండి శోకమున్
జూడగకన్నులేక చెవిఁ • జొచ్చక మాటలుదంతమూడ వ
ల్గాడెదువృద్ధకాలమక • టా నినుగొల్వనీదుమాధవా॥ ౪౦

ఉ॥ చీరెలులేవుకట్టుకొనఁ • జెంబులులేవు కుమారకేయ సం
భారము లేదుకూరలకు • బంగరుగాజులు లేవు చేతులన్
బోరినలాభమేమిఁకను • బోయెదనాతలితండ్రియింటికిం
చానఁడిఁబెట్టుభార్య యవు • గా నినువేడఁగనీదుమాధవా॥ ౪౧

ఉ॥ కోడెలు గేదెలావులును • గొట్టెలుచేలు మెఱుంగునీరు మా
రాడికమార్చిపంచుమన • యమ్మకునాలుగు రోజులెక్క వే
కూడిడినాముసిదు నతి • కొంచెముమాన్యలమూడ్చునంచు బో
రాడెడిసోదరుల్ తమవ • దాడ్డములన్ గననీదుమాధవా॥ ౪౨

ఉ॥ నీటుగుమాలలున్ పసిడి • నీటైనలందిన నుచ్చుటోపి బల్
థాటిఁజెలంగుసేల్వులు కి • లావరుయుంగరముల్ బనార్సులాం
కోటులొపంగు లేదనుచు • గొన్నెడియుల్కులమూరియుల్లుఁడే
నాఁటికిఁగూడనిన్ను శర • ణంబననీఁదుగదారమాధవా॥ ౪౩

ఉ॥ చల్లపెరుంగుపాలు తరి • సన్నని బియ్యము పైపిటీగెతో
నల్లిసనానుకంబెకడి • యంబులుకాసులు దోచికన్న వా
రిల్లునుగుల్లజేసి తన • కేమియు లేదని వీధివారితో
నల్లరిఁజేయుచెల్లెలవు • రానిను వేఁడఁగ నీదుమాధవా। ౪౪

ఉ॥ బొమ్మలు కాగితంబులును • పుస్తకముల్ బలపాలు వల్కులన్
సొమ్ములు కానులద్దములు • నూదులు సబ్బులు జేదిపవ్వ పా
కమ్ములుగాక వెన్నెలను • గాయుచునుండెడి చందమామ నే
డెమ్మనిపోరుబిడ్డలు మం • దిన్ నిను నమ్మఁగ నీరుమాధవా॥ ౪౫

ఉ॥ విత్తనముల్ విదల్చి తడి • వేమరుగట్టి హలాయుల్ చెలంగపెం
పెత్తినవారుదీసి బలం • మెక్కిన మల్లునాటి కల్పనే
చెత్తనుదీసి గట్లనిడి • చేలను పైరును గోసి నూర్చి వ
డ్లెత్తుక పోవు సేద్యము రెం • కే నినుగొల్వదు శ్రీరమాధవా॥ ౪౬

ఉ॥ గ్రామములన్ జరించి సెన • గల్ ధనియాలుపొగాకుమిర్పియా
సాములఁగొల్లచౌకఁగొని • క్షామముఁగోరి గిరాకిఁజూచి కో
స్తాముని షీలకమ్మకము • సల్పి పదింతలు లాభమొందు మా
రాముడి బేరమోల్లునిను • పార్థనసేయఁగనిచ్చు మాధవా॥ ౪౭

ఉ॥ భోగములన్ మరంగి వైట • పుర్గడదూరము జేసినత్యమున్
త్యాగమొనర్చి జీతమొవ • ధానముగా గమనించి నేర్పుతో
కాగితముల్ లిఖించియొక • కాసు మొదల్ పదివేలు గూర్చును
ద్యోగము నిన్ను జేరగ • యుక్తిగ్రహించను శ్రీరమాధవా॥ ౪౮

ఉ॥ రంగదనంగ సంఘటిత ♦ రాజితనిర్ఝరిణీ చటచ్ఛటా
భంగతరంగ ఘోషలను ♦ వారియువారితరీతిఁ జొచ్చినన్
పొంగకనిల్చిభోరుమని ♦ మ్రోగెడిసంద్రముభాతి బాధలె
వ్వంగిఘటిల్లినన్ విడక ♦ ప్రార్థనజేసెదనిన్ను మాధవా॥ ౪౯

ఉ॥ గాలియడంగిపోయిన న♦గంబులు గ్రుంగిన నిప్పుచల్లగాఁ
గ్రాలినఁ జుక్కలూడిన జ♦గంబు లదృశ్యములైన నీవొకే
లీలవికారమొందక వి♦లీనముఁ జెందక శాశ్వతంబుగా
కాలములన్నిటన్ నిలిచి ♦ కాపురముందువు శ్రీరమాధవా॥ ౫౦

ఉ॥ భూరితరప్రభావపరి♦పోషితభూషితమా త్వదీయ వి
స్తారకటాక్షవీక్షణ శ♦తంబను నావ యొసంగకున్నచోఁ
గ్రూరభుజంగదంత విష♦కుంభిత ఘోరపిశాచరూప సం
సారమహాబ్ధిదాటఁగవ♦శంబె విధాతృనకైన మాధవా॥ ౫౧

ఉ॥ శాత్రవసైన్యమధ్యమున ♦ స్యందనమాపి ప్రశాంతచిత్తుఁడై
పుత్రసుమిత్రభ్రాతృగురు♦పుంగవులన్ దిలకించి దీనతన్
క్షాత్రముమాని భీతిలి వి♦చారముఁ జెందిన క్రీడికిన్ కురు
క్షేత్రమునందు గీతలు వ♦చించిన దేశికవర్యమాధవా॥ ౫౨

ఉ॥ ఎట్లు గుణత్రయంబు సృజి♦యించితొ నిర్గుణమూర్తివై జగం
బెట్లు త్వదీయకుక్షిని వ♦హించితివో గద నిర్వికారివై
యెట్లు దశావతారముల♦నెత్తితివో కొ నిరంజనుండవై
యెట్లు మదీయపాపముల ♦ నెన్నక ప్రోతువొ శ్రీరమాధవా॥

ఉ॥ పోడిమిమీరకోయ్యలగు•ముల్గమకంబులు ప్రాసలర్థముల్
గూడిరసంబుగల్గు వద• గుచ్ఛములల్లగ యాతఁడె
వ్రాఁడులిఖింపగ్రంథమని•బల్కుకనాకలమందు తాండవం
బాడును దంథణంధణ ధ•ణారవముల్ జెలువొందమాధవా।

ఉ॥ శారదచంద్రికాజనిత•సారముగ్రోలు చకోరకంబు నీ
హారరసంబుద్రావఁగల•దా శుకశౌనకపుండరీక సా
మీరివిభీషణాదులు ర•మించితరించిన నీదునామ మం
దారమరందమానకెటు• నామనమన్యముఁగోరుమాధవా॥

ఉ॥ నీటగుగాయనీమణుల•నృత్యవిలాసము సన్నజాజి పూఁ
దోటలతాఘుమంఘుమలు • తోయజనేత్రలతోడిఖుల్లు స
య్యాటలుకర్పూరంపు విడె•యంబులు చందనలేపనంబు నా
కేటికినీదయారస మొ•కింతస్రవింపఁగఁజేయుమాధవా॥ ౫౬

ఉ॥ భారములేకనేవిషయ•వాజిఖలీనముఁన్ బిగించి యో
షారినిలాగనీక నుప•థంబున స్వారినిదీయువిద్యనే
నేరువలేదు నీపద•నీరజముల్ నెరనమ్మియున్యముఁ
జేరనిశక్తినాకొసఁగి•శీఘ్రమెప్రోవుము శ్రీరమాధవా। ౫౭

ఉ॥ సొంపుదలిర్పకోయిలకి•శోరములెయ్యవి కూతగూయఁగాఁ
జంపఁదలంచువాయసము•చాడ్పునహామనమన్యమేమి యా
సింపకనిగ్గగనగ్గదలఁచి•సేవకుఁబూనెడివేళలందు వా
రింపగరానినిద్ర ముసి•యుంచునిదేటి యవస్థమాధవా॥ ౫౮

ఉ॥ ద్రౌపదిఁ బ్రోచి రాతినొక ◆ కన్యగఁ జేసి కిరీటిఘోరసం
తాపము సంహరించి కరి◆నాథునిఁ గాచి కుచేలునేలి సాం
దీపునిపుత్రునిన్ మరలిచి ◆ దీనుఁడనై విలపించుచున్న నా
పాపముఁ బాపకున్న నగు◆బాటగుఁగాదె ధరిత్రిమాధవా॥ ౫౯

ఉ॥ మారుతమెట్లు పుష్పాడి దు◆మారము రేపునొ మిన్ను ముట్టనా
నేరములల్లి భిన్నమయి ◆ నింగి తెరంగున శూన్యమొందసం
హారముఁ జేయకున్న నణు◆మాత్రము సైపను సుమ్మి నాదుహృ
త్సారసమందు నీపదము ◆ సంకెలినై చిబిగింతు మాధవా॥ ౬౦

ఉ॥ అందమొసంగు కెంజిగురు◆టాకులఁ గేరెడి పాదముల్ రుచుల్
పొందినజాళువా తళుకు ◆ పుట్టము నాల్గుభుజంబు లిందిరా
సుందరిగల్గువక్షమును ◆ సొంపొనగూర్చెడి నల్లచాయ నీ
వెంమున డాగినన్ గురుతు◆లింకెటు పోయెదవయ్య మాధవా॥

ఉ॥ సారములై ఖలాళికి వి◆చారములై యనిమేషకోటి కా
ధారములై వ్రిదోషక వి◆దారములై దనుజేంద్రబృంద సం
హారములై సుమానసవి◆హారములై యసమానకీర్తి వి
స్తారములైన నీదుచరి◆తల్ వినఁగోరికగల్గె మాధవా॥ ౬౨.

ఉ॥ మానసమందు లోకపరి◆మాణము భారముగాఁగఁదోచి ని
ర్యాణముఁ జేసి నీవు మహ ◆ దంబర చుంబిచటచ్ఛటచ్ఛట
ధ్వానముహూర్ఝుహూర్ల్లురద ◆ భంగతరంగ పయఃపయోధినే
పానుపుగాగ్రహింతువట◆పన్నగతల్పము వీడి మాధవా॥ ౬౩

ఉ॥ కుక్కనుకొండగొఱ్ఱియను♦గోతిని గార్దభముఁ వరాహముఁ
నక్కనుగోక్కురఁ పశుగ♦ణంబులముట్టి మనుష్యజాతిలో
నొక్కఁడుగాజనించియుమ♦హోవక్రతిఁ ఘటియించువంచముఁ
వెక్కసమూనితాకరిది♦ వింత ధరింపనిచింత మాధవా॥౯౪

ఉ॥ తాగినుగంజలేక మెయి♦దాల్పగవస్త్రములేక ఘోరమా
రోగముచేతగుందిన బ♦యుండను మంచములేక నూరిలో
కేగిన నంటుదోసమున ♦హీనతనొందెడు పంచముండరో
యేగతిజీవయాత్ర ధరి♦యించునొ నీవెవచించుమాధవా॥

ఉ॥ రెక్కలుముక్కలౌనటుల♦రేయిబవల్ శ్రమజేసికొక్కముఁ
బొక్కసమందునింపి యతి♦భోగులజేసి నుతించువంచముఁ
గుక్కలకన్న నెక్కుడగ♦గొట్టెద రావలికేగుమంచయో
దిక్కుదివాసిలేని జగ ♦తిఁ సృజయించితివేలమాధవా॥౯౬

ఉ॥ లోకములోన జన్మముల♦లో నరజన్మము శ్రేష్ఠమంచు తా
టాకులలోనవ్రాసిన మ♦హాత్ముల వ్రాతలదోసిపుచ్చి చీ
కాకొనరించు బూటకపు♦గాథలుఁదిన్న కారణంబుచే
కాకులకన్న నీచముగ♦గాంతుదుఁ పంచములఁ రమాధవా॥౯౭

ఉ। నాలుగువత్సరంబులయి♦వఁ బరిపూర్తిగలేని కూనయౌ
బాలికతొడ్పుచుండగ వి♦వాహముజేసి మగండు వెంటనే
కాలునిజేర నాపె కల♦కాలముదుఃఖముఁ జెందుచున్న యా
గోలయ గుండెఝల్లురస♦కుంఠనె మాధునకైన మాధవా।

ఉ॥ మానవతీమణుల్ జదువ • మంచిదిగాదట స్త్రీరజస్వలే
యైనవివాహముల్ సలుప • న్యాయముగాదట చేడెఛత్రముల్
బూనఁగఁగొప్పకోసముట • ముండ్లయినన్ నరి పాదరక్షలన్
మానినిదాల్చనేరమట • మాయలమారివిధుల్ రమాధవా॥

ఉ॥ భార్యలునల్వురుండిన వి • వాహపుటర్హత పూరుషాళికిన్
చర్య సతీజనావళికి • చట్టములేక మగండుచచ్చినన్
కార్యమువేరలేదనుచు • కర్ణకఠోరపు వాక్యజాలమే
యార్యుఁడువల్కె ప్రేమమది • యం దణుమాత్రములేక మాధవా

ఉ॥ మానవులైన స్త్రీలకు స • మానపు స్వేచ్ఛయొసంగకేసభా
స్థానములందుఁదాపడక • సజ్జనబృందము చేయు ప్రార్థనల్
గానగనీకప్రొయ్యిపొగ • కన్నులఁ జొచ్చిప్రియాసమొందఁగా
బోనులనుంచు సింహముల • పోలికనుంచెదరేమి మాధవా॥౨౧

ఉ॥ కోవిదలిర్వ శాస్త్రముగ • డించి లిఖించెను గ్రంథరాజిలీ
లావతి దేవహూతియుబ • లల్ చదువుల్ చదువంగ రాదనే
భావము సిగ్గుచేటగు ప్ర • పంచమునన్ గళలన్ని శారదా
దేవియధీనమందుగల • తీరు గ్రహించిన శ్రీరమాధవా॥౨౨

ఉ॥ పుత్త్రులుబావితోట చెరు • వుల్ కృతిసత్రము దేవగేహమీ
ధాత్రిని బున్నమిచ్చెడి వి • ధమ్మున మానవజాతికెల్లెడన్
బాత్రమొరింగి బాలికల • భద్రగతించిన బెండ్లిసేయ స
త్పుత్త్రులుపౌత్రులున్ గలుగు • పున్నముగల్గును శ్రీరమాధవా॥

ఉ॥ ప్రేమరవంతలేక నిను • భిక్షము భక్షముగాదు రోగులన్
బాముల బెట్టి డబ్బుగొను • వైద్యుఁడు వైద్యుఁడు గాఁడు దీనలో
భామల స్వేచ్ఛనోరువని • పత్రిక పత్రిక గాద నాథలో
లేమల పెండ్లిఁ గూడదను • లీడరు లీడరు గాడు మాధవా॥ ౭౪

ఉ॥ కోరికెదీర మంచి తళు•కుల్ బెళుకుల్ గల మేల్మి వన్నె బం
గారపు భూషణంబులు ని•గారపు కాలయకోట్లు నూట్లు మో
టారులు వెండిగిన్నెలు వ•టంబులు నీయఁగలేని బీదసం
సారికుమార్తె పెండ్లియగు • మార్గము గన్పడదేమి మాధవా॥

ఉ॥ ప్రాయము జాలనట్టి పసి•బాలికలన్ దమతల్లిదండ్రులా
దాయముకై భ్రమించి స్మృతి•దప్పితుయన్ గృశియించి క్షీణతన్
కాయముఁ గ్రుంగి మస్తకము • కంపము దాలిచి నేలపైఁ బడన్
గాయములొందు వృద్ధులకుఁ•గట్టెద రేమితమాష మాధవా॥

ఉ॥ అక్రమపద్ధతుల్ దునిమి • న్యాయము స్థాపన జేయునట్టి నీ
చక్రము గాక వేఱె యొక•సాధనమున్నదె లోకమందు ని
ర్వక్రములౌ విధానములు • రాజులఁ జేయఁగ మున్న రాష్ట్రముల్
శక్రుఁడు బోరుకాలమున • శాంతిని గూర్పఁగ లేదె మాధవా॥

ఉ॥ కాకులు గోరువంకలు బ • కంబులు దిల్కలు చక్రవాకముల్
ఘూకములూర బిచ్చుకలు • కోళ్లు చకోరకముల్ మయూరముల్
కోకిలముల్ కపోతములు • గువ్వలు మున్నగు పక్షిరాశి ని
వేకరణిన్ సృజించితివొ • యెవ్వరు జెప్పఁగలారు మాధవా॥ ౭౮

ఉ॥ కాకులు గొంగలాచు శునకంబులు మత్తగజంబులాచు బెం
డ్లాకులు తమ్మిలాచు కుజనాళి బుధావళియాచు స్వప్నమం
దేకరణిం గనంబడు న దేవిధి నీజగమెల్ల మిథ్యయై
నీకు వినా మరెద్దియును నిల్వఁగఁజాలదు శ్రీరమాధవా॥౭౯

ఉ॥ పన్నగమెట్లు పాములను బట్టెడువాని పదాలసొంపుకై
గ్రన్నన మోవిలఁజేరి పలు కష్టములొందునొ యట్లె తెంత్రముల్
పన్నినగాథలం వినఁగఁ బర్విడుఁగాని మదీయ కర్ణముల్
పున్నపునీకథల్ వినఁగఁ బోవు జవంబున శ్రీరమాధవా॥౮౦

ఉ॥ సంపెగపుష్పమందుగల సారతరంబగు తావిభృంగమా
సింప వినాశమొందునటు లింపగు నీపదపద్మగంధమా
సింపక నాదు నాసికము చెచ్చెరఁబోవు జవాజిపున్గు క
ప్రింపునుగంధవాసనలపై మమకారముచేత మాధవా॥౮౧

ఉ॥ పండనియగ్నిఁ గాంచు శలభంబులమాడ్కి మదీయనేత్రముల్
దండిప్రభుండవైన తమ దర్శన సంపదఁగాంచలేక బల్
కండలఁ గ్రొవ్వులం దనరి గబ్బిచనుంగవ గల్గునట్టి స్త్రీ
మండలి వంకఁ జూచు నతి మత్తతఁ గ్రొవ్వి తెగించి మాధవా॥

ఉ॥ జాలరిగాఁ మందెరను జంపి భుజింపఁ దలంచి మత్స్యమా
గాలమువందు జిక్కి దరిఁ గానక దుఃఖముఁ జెందునట్లు నా
నాలుక నీపవిత్రమగు నామసుధారసముం గ్రహింపకే
క్రోలును షడ్రసంబులను గోరికతోడను శ్రీరమాధవా॥౮౩

ఉ॥ మత్తకరీంద్ర మొంటిగుఱ • మానగ వృక్షము చెంత వ్యాఘ్రమా
యత్తము జేసియున్న నొక • యల్లిక పైఁ బను దెంచి గుంటలో
తత్తరపాటు చేఁబడు వి • ధంబున నాదు శరీర మత్తఱిల్
మెత్తుకొనుం ద్వదీయపద • స్మృతి కఁ గోరక శ్రీరమాధవా॥

ఉ॥ కమ్మని తెమ్మెరల్ సడల • గా వడి గ్రుమ్మగ నమ్మదమ్ము చే
చెమ్మట గ్రమ్మ యుమ్మయొక • చిన్కు ముఖమ్మున లేక నన్ని ప్రా
ణమ్ములు దిమ్మరొంద వ్యస • నమ్మధికమ్మయి సొమ్మసిల్లు గ్రీ
ష్మమ్మున నిమ్మున న్మెడిక్రి • మమ్ము మనమ్మున లేదు మాధవా॥ ౮౫

ఉ॥ పెల్లున చల్లగాలి వడి • వీఁచఁ గొల్లఁగ నెల్లదిక్కులం
బిల్లియు నల్లి బల్లియును • బిల్లలు బల్లిదులెల్లవారు భీ
తిల్లగ నల్లిబిల్లి ఘటి • యిల్లుచు నుండెడి శీతకాలమం
దుల్లము తల్లడిల్లకన • నొల్లకు మెల్లగ నిన్ను మాధవా॥ ౮౬

ఉ॥ కారు మొయిళ్లనుండి యుద • కంబతి ధారగ గారి జోరుగా
దారుల జేరి మీరి వటు • దర్పపరంపరలం జెలంగగం
భీరబలాహకా రవము • భీకరమై తగు వర్షమందు కం
గారయి హృత్సరోరుహము • గానఁగ నేరదు నిన్ను మాధవా॥

ఉ॥ పుత్రులు నిల్వఁబోరు పొల • ముల్ విడిపోవును గేహముల్ చెడుం
గాత్రము క్షీణమొందు సతి • గన్పడ దర్థము గ్రుంగు బంధువుల్
మిత్రులు దూరమౌదు రని • మిథ్యగ నెంచి జగత్సుఖంబు నీ
స్తోత్రముఁ జేయువారి పద • ధూళి శిరంబున దాల్తు మాధవా॥

ఉ॥ తేనియఁ బెట్టియాగకడు • తియ్యని పాలనుగూర్చి యావుదీ
న్నా నెమెసంగు కస్తురివ • నంబుననుండు మృగంబొసంగి ని
ర్ధానము జేసికోయిలము • దంబిడి యన్యులసేవఁజేయఁగా
మానవుఁడేమిచేయవలె • మానినుతాంఘ్రిసరోజమాధవా॥

ఉ॥ శారదకోవిదారవట • చంపక కేసరబిల్వతాళ జం
బీరరసాలశాబరక • పిత్థమధూలకవాతపోథ మం
దారతమాలవంజులక • దంబ ఖదిర శిరీష తింత్రిణీ
భూరుహముల్ సృజించినప్ర • భుండవు వాహ్వరెశ్రిరమాధవా

ఉ॥ నీవుసమస్తలోకముల • నింగితెరంగు చెలంగియుండియా
రావగుణంబునొందక జ • రామరణంబులఁజెందకే మనో
భావముఁబొందకేవిషయ • వాసనలంటకెనత్ప్రకాశ సౌ
ఖ్యావళి కాలవాలమగు • నట్టిస్వరూపుఁడవయ్య మాధవా॥౯౧

ఉ॥ చారలు బార్లుదీరగ పి • సాళిరుచుల్ దళుకొత్తుజాళువా
చీరనివాటుమీరనున • జెక్కుటిసెజ్జకు నీటుముంగురుల్
జారజిలుంగుపయ్యెద వ • చారిడనెమ్మొయిమేల్మివన్నె బం
గారును గేరుశ్రాథ నిను • గాంచితరించె సెబాసు మాధవా।

ఉ॥ రావిడిదీరు మేల్పసిడి • రంగులలందిన గద్దియల్ వసం
దా పరువుల్ నివాటెసగు • ద్దవుమేడలు మానికంబులక్
దాపినపట్టిమంచముల • దాశక చిల్వలరేని శయ్యనీ
వేపనఁబూనిదాల్చితివొ • యెవ్వరుచెప్పఁగలారు మాధవా॥౯౩

ఉ॥ పన్నగవేణిచంద్రముఖి • పంకజగంధి సువర్ణగాత్రి సం
పన్నతభాగ్యశాలి నవ • పల్లవకోమలపాణి యెన్నఁగాఁ
కిన్నెరమీటుచుఁ గదన • కేళినెఱుంగని సత్యభామ నీ
సన్నిధి దానవాగ్రణిని•జంపిన చిత్రమదేమొ మాధవా॥౯౪

ఉ॥ కోయనితియ్యనల్ బరపు•కూతలుగూయుచు లేతమావికెం
జాయచిగుళ్లమేయుచు వ•సంతములుగుల్కుచునుండుకోయిలల్
వాయసమూరకేతనదు • వాటపుచంచువుతోడనొక్కి బల్
గాయములొందఁజేయునుజ•గంబిటులుండుటదేమొమాధవా॥

ఉ॥ కాలునిదూతలోయన బ • కంబుర్ఘుమంబుల జాలిలేక మా
ర్జాలముమూషకంబులను •సర్పములన్ విహంగాధిపుండు శా
ర్దూలముగోవులన్ దరిమి •దోర్బలతన్ భుజియించునీజగ
జ్జాలపుగారడిన్ దెలియ • శక్యమె వారికి శ్రీరమాధవా॥౯౬

ఉ॥ క్రోధపుమిట్టమోహముల • గుట్టనరంబులచుట్ట ఘోరమా
వ్యాధులవుట్ట దుఃఖముల • కంతములేనటువంటిబుట్ట బల్
బాధలతట్ట క్షోభముల • పట్ట మదంబులమట్ట దేహము
య్యాదయజూపిజన్మమును•గంటగఁజేయుము శ్రీరమాధవా॥

ఉ॥ నీచరితల్ లిఖింపని మ•నీషి మనీషియుగాడు నిన్నువే
జూచెడికోర్కెలేని యతి•సూరుఁడుసూరుఁడుగాడు భక్తితో
నీచరణాబ్జముల్ గనని • నేర్పరి నేర్పరిగాఁడు నిన్నుచే
సాచినుతించనట్టి నర•జన్మము జన్మముగాదు మాధవా॥౯౮

ఉ॥ అండముపిండమంబుజ భ◆వాండమునిండిల సర్వచండమా
ర్తాండవికాసపావక వి◆రాజితపూర్ణ శశాంకమండలాల్
మెండుగ వెల్గఁజేయఁగల◆మేటి వెలుంగును గల్గియుండియే
యండయు లేక నేనిలచి◆నట్టి మహాత్ముఁడవయ్య మాధవా॥

ఉ॥ కారణమీవులోకమున ◆ కర్తవునీవు చరాచరాళి కా
ధారమునీవు ప్రాణులకుఁ◆దండ్రివినీవల వేల్పుపెద్దవున్
శూరుఁడవీవు పాపముల◆శోషిలఁజేయఁగ ఘోరదైత్య సం
హారుఁడవీవు భావముల ◆ కందనివాఁడవునీవుమాధవా॥౧౦౦

ఉ॥ మూలము లేనినాజనన◆ముల్ మరణంబులునీకుఁ గ్రీడఁగా
బోలవినాకుభారమిఁకఁ ◆ బుట్టువుగిట్టువు లేకచేసిన
న్నేలకయున్న నీచరణ ◆ మేగతియంచు మదిన్ దలంచి యే
జోలియు లేనినాయునురు◆చూపుము నీకు నిజంబుమాధవా॥

ఉ॥ నేనతిమూఢుఁడన్ జడుఁడ ◆ నిన్నుస్తుతించెడిమార్గమున్ రవం
తేనియెఱుంగనట్టి మతి ◆ హీనుఁడ స్వల్పుఁడఁబాపకర్ముఁడన్
మానవనామధారుఁడను◆ మాయకున్ విషయప్రలోలుఁడన్
గానమదీయరక్షణము◆ కష్టముగానగు నీకుమాధవా॥ ౧౦౨

ఉ॥ చంద్రుఁడు లేనిరాత్రి పతి ◆ సమ్మతిలేనిసువర్ణగాత్రి రా
జేంద్రుఁడు లేనిధాత్రి చన◆వించుకఁ గానని మైత్రిరీతి ని
సాంద్రదయాసముద్రమున◆స్నానముఁజేయని జన్మవ్యర్థమౌ
యింద్రనుతాంఘ్రివారిజ గ◆జేంద్రవిచార నివారమాధవా॥

ఉ॥ రాగులు బోయి రెందరో వి♦రాగులుగూలిరి మిక్కుటంబుగా
త్యాగులుగుంపుగాడనిరి ♦ దాగిరిభోగులు పుష్కలంబుగా
యోగులుగూడనేగిరిఁక ♦ నుండెడివాఁడెవఁడీజగాన నీ
వేగదయున్ని కాలముల♦నేమరకుండుట శ్రీరమాధవా ॥౧౦౪

ఉ॥ మాధవమాధవాయనుచు ♦ మాటికిమాటికి వ్రాయుజాలకే
మాధవనామలాంఛనము ♦ మాత్రము వ్రాసితినంచు నీవు నా
మీఁదచలంబుఁబూనక క్ష♦మింపుము మాధవ శ్రీరమాధవా
మాధవ శ్రీరమాధవర♦మాధవమాధవ శ్రీరమాధవా॥ ౧౦౫

ఉ॥ భాగ్యము భోగమాయువు శు♦భంబును గల్గి చెలంగిసంతతా
రోగ్యులునై పరస్పర వి ♦ రోధము లేక మెలంగి జ్ఞానులై
యోగ్యులునై మనిషులయి♦యుత్తములై భవదీయసత్కృపా
భాగ్యము చేఁ బ్రజానమితి♦వర్ధిలుగావుత శ్రీరమాధవా॥౧౦౬

ఉ॥ కమ్మకులావతంసము జ♦గత్రయపూజ్యముపాటిబడ్డ వం
శమ్మునసత్కళాయుత ని♦శాకరబింబము పాపవారి వా
హమ్ములణంచుమారుతము♦నై తగు వీరయ దేశికేంద్రు సా
దమ్ములుగొల్చినిన్నుఁగని♦ధన్యుడనై తినిశ్రీరమాధవా॥ ౧౦౭

ఉ॥ ఆతతమైనకమ్మకుల ♦ మందుజనించి విశేషమైన ప్రి
ఖ్యాతిగడించినట్టి యిన♦గంటి నృసింహుఁడు బాపమాంబికా
చేతమురంజిలఁగనిన♦చిన్నికుమారుఁడఁబున్నయాఖ్యుడఁ
కై తనుగూర్చిసీకిడితిఁ♦గల్వలమాలధరించుమాధవా॥ ౧౦౮

